శ్రీ వేంకటేశాయ నమః

# స్తోత్రరత్నావళి





అనువాదకర్త

ఘానమామూర్తి వరదాచార్యులు

చెన్నూరు.



మాన్యశ్రీ
కలకుంట మాధవరావుగారు.



శ్రీవారిసతీమణి
శ్రీ రమణమ్మ దొరసానిగారు
వారి కీకృతి అంకితమైనది.



మాన్యశ్రీ
కలకుంట కిషన్‌రావుగారు
శ్రీ మాధవరావుగారి జనకులు.

# తొలి పలుకు

కలకుంటవంశ భూషణులగు శ్రీ మాధవరావుగారి సతీమణి శ్రీ రమణమ్మగారు పరమ పదించినపుడు వారి బంధువులు పరిసరములనుండు ప్రజానీకమును చింతార్ణవగతులైరనుట లతిశయోక్తి కాదు.

వారి యంత్యక్రియలొక యజ్ఞకర్మవలె నిర్వహింపబడినవి. ఆ సమయమున ఉ॥వే॥ విద్వాన్ శ్రీ॥ కృష్ణమాచార్యులవారు వారి వంశ చరిత్రమును పద్యములలోరచించి వారి కీర్తికి విజయపతాక నెత్తినారు. వారి సౌజన్యమును శ్రీ మాధవరావుగారి ఉదాత్తచరిత్రమును వేనోళ్ల కొనియాడిరి.

శ్రీ రమణాంబగారు పతివ్రతా శిరోమణి. ప్రపన్నులకు మార్గదర్శకురాలు. బీదసాదలకు కామధేనువు. చొక్కపు బంగారమగు వారి చరిత్రలో వారి గుణమణులు ప్రకాశించుచు శిరోధార్యములైనవి. వారి ప్రపన్నాత్మకు నేనును నాకృతిరత్నమునొండు కానుకగా నొసంగితిని. ప్రస్తుతకృతి తదాకృతియే. దీనిపేరు "స్తోత్రరత్నావళి" ఇందు శ్రీవేంకటేశ సుప్రభాతము, శ్రీవేంకటేశ్వర మంగళాశాసనము, శ్రీవేంకటేశ కరావలంబస్తోత్రము, శ్రీభజయతి రాజస్తోత్రము, శ్రీభజగోవింద స్తోత్రము, శ్రీలక్ష్మి

నృసింహ కరావలంబస్తోత్రము, అనునవికలవు. ఇందు శ్రీవేంక టేశకరావలంబస్తోత్రము మాత్రము నాచేరచింపబడినది. తక్కినవి సంస్కృతము నుండి తెనుగున ననువదింపబడినవి. ఇది ప్రపన్న పారాయణ యోగ్యమైనది. సంస్కృతము తెలియని భక్తులకిది యుపకరించునని ఈసేవ నొనర్చితిని. ఇది సహృదయహృదయా మోదము నొందగలదని యాసింతును. ఇతిశమ్.

ఇట్లు

వానమామలై వరదాచార్యులు.

# విషయసూచిక

శ్రీ వాగీశ్వర్యై నమః

# రమణాంబావంశప్రశంస

ఆంధ్రప్రదేశమందున
సాంద్రారణ్యగత కాష్ఠజలతృణవృద్ధిన్
ఇంద్రపురీ విభములకుఁ
గేంద్రబై యాద్లబాదుకీర్తి వహించెన్.

అందులక్సెట్టిపేట తానందమొలుకు
పరగణాయని మండల ప్రథితమయ్యె
తత్పరగణాధిపతి కృష్ణధరణిపునకు
మహితజన్మస్థలంబయ్యె మఁదమఱ్ఱి.

ఆపురిలో గౌరయదొర
కాపురమొనరింపసాగె ఘనతరయశుఁడై
శ్రీపద్మనాయకకులో
ద్దీపకుఁడై లింగమాంబదేవిఁగ మనఁగన్.

అతనికి కృష్ణరాయవసుధాధిపుఁడుద్భవమందివెల్గె నీ
క్షితిని వదాన్యుఁడై సతత శ్రీహరిచింతకుఁడై సదా, యశ
స్సతినివరించు చున్లలిత సంగతి మాధవరాయ భూపతిన్
గుతుకము పీరలక్ష్మియను కూతునుగాంచె విరించికల్పుఁడై.

మందలుగాఁగగోతతిని మాన్యతఁ బ్రోచియుక్షీరమానుచున్
సుందర బాలుఁడై తమిని సుప్తినిఁ జెందును మఱ్ఱియాకుపై
నందముగా నటంచు మన మందుఁదలంచియొ మాధవార్చకై
మందయుమఱ్ఱి యేకమయి మంజుల దివ్యనివాసతంగనెన్.

అట్టిమందమత్తినాజాను బాహుండు
దీనరక్షకుండు దివ్యయశుఁడు
కల్వకుంట్లవంశకలశాబ్ధి చంద్రుడు
మాధవుండు తనదుమనికిఁ జేసె

ఆడితప్పనివాఁడు నూరారులైన
లేదనకయిచ్చునడిగిన పేదకెల్ల
కాలుఁబెట్టినచోట బంగారుపండు
కేలముట్టినజాలురత్నాలె యగును.

గోరక్షకుఁడున్ మరియున్
శ్రీరంజకుఁడగుటెకాక క్షితికాంతాహ్వా
త్సారసమిత్రుండగుటలు
మారమణీ మణియునతని మగనిఁగఁ గొనియెన్

పూస్కూరివంశాబ్ధిఁ బుట్టువొందిన లక్ష్మి
కలువల కుంటలో కాలుఁబూన్చె
శ్రీలసంపదలలో డోలలూగెడి లక్ష్మి
పరలోకతత్వ సద్భావమెరిఁగె
ఉన్నత పదవులనోలలాడెడి లక్ష్మి
వినయ వివేకముల్ తనువుఁగొనియె
ఘనతరాష్టైశ్వర్యవనధులబ్బిన లక్ష్మి
నిరుపేద జనములఁ గరుణనరసె

గుండెనిండుకుండ, కోమలవాక్కులం
 గన్నతల్లి చూపుక నికరమ్ము
అనఘ గర్వవిరహితాచరణమ్ములు
 రమణమాంబకెందురమయెసాటి.

నవసుతరత్నమ్ములు మా
నవతకును బ్రతీకలగుచు నవనిధులవలెన్
నవయువతా నిధులై దా
నవతనిలన్ రూపుమాప నరులై రనఁగన్

తానుదశావతారములఁ దాల్చెను మాధవుడందు రందురూ
హానినవావతారములె యొప్పెసలారెననన్ నవాత్మజుల్
గానగనై రి కృష్ణుఁడన గావర శ్రీ పతినాఁబ్ర భాకరా
ఖ్యాన జనార్దనాదులన ఖ్యాతిఁగడించి చరించిరిమ్మహిన్.

మారుత సౌరభై క్యతల మారమణీ మణిమాధవుండునున్
మార మనోజ్ఞరూపులకుమార సమానపటు ప్రతాపులన్
వీరుల విక్రమార్క సమవిశ్రుతతేజుల వాగ్మిభోజులన్
పూరుషసంతతింగనియె పూర్వపు పుణ్యఫలాలు నానిటుల్.

జానకీ పతిగాఁ బ్రశస్తుఁడౌ కృష్ణుండు
 శ్రీపతియాండాళుఁ జేరి యొప్పె
అచ్యుతునకుదత్తుఁడైన ప్రభాకర
 రాయలు లీలఁ బెండ్లాడివెల్గె

రాజ్యలక్ష్మిసతీరతుఁడు జనార్దన
ప్రభువుమూవురఁ గనిపాసిచనియె
రామరాయలును శారదనొంది దీపించె
లక్ష్మణుండు సుజాతలతికనలరె.

సత్యప్రియఁగొనె విద్యోరుసాగరుండు,
శ్రీ సుధాకరుఁడున్ సతిన్ స్వీకరించె
పూసుకూర్ సూర్యకాంతుని పుత్రిలక్ష్మి
రహినివరియించెను సురేంద్రరాయవరుని.

నలువురఁ బేరుప్రతిష్ఠల
నిలుపుకొనిన శీలవతులు నిర్మల మతులున్
సలలితగుణరూప యుతలు
నలువురు సుతలుదయమందినారా సతికిన్.

లక్ష్మణ ప్రభువరియించె లలిత సతిని
విజయలక్ష్మి జగన్నాథ విభుఁడుగొనియె
అంజలియు హనుమంతరాయాఢ్యువలచె
రమ వివాహమ్మునకు ముందె రమణయేఁగె

ఆమెకు విరోధికృత్తులేఁడవనియందు
కానికాలమ్మదె విరోధకారియయ్యె
మాసములకెల్ల శీర్షము మార్గశిరము
మార్గదర్శకమయ్యె రమణకు దివికి.

## 5

అరయద శేంద్రియంబులుహృ దబ్జముతోడ సమైక్యమందగన్
హరినిస్మరించువారికెదశై కతిథిన్మరణమ్ము గల్గినా
పరమ పదమ్ము ప్రాప్తమగు బాపురెయంచు జనమ్ము పాడఁగా
నరిగె పదొాండుసత్తిథిని నందరఁ బాసిభవమ్ము రోసితాన్.

నీ దొక పూర్ణ జీవితము నిక్కువమాసకలార్థ సంపదల్
కాదనకుండనిన్వలచెఁ గావలెనెయ్యదియింక నీకుని
మ్మేదిని మాధవుండెపతి మీది భువమ్మున మాధవుండె కా
మాధవరావు భూపతికి మాత్రిము నీ దగుజంటలేదిఁకన్.

చల్లనిదైన నీ హృదయ సాధుతనెల్లరఁ జల్లిపోయినా
విల్లెడు నీ కుటుంబమది యేడ్చుట లెక్కయెకాదొ కింతయున్
బల్లెకుపల్లెయేడ్చెగురు బంధు జనమ్మును నేడ్చిరెల్లరున్
తల్లిరొ నీదుమంచికినిదర్శనమిద్దియెకాదె మేదినిన్.

ఏకాదశి మృతవైతివి
యేకాదశ పద్యతతినినే బాడితినిన్
నీ కోమలమగు నాత్మకు
సాకేతపురీశుఁడెందు శాంతినొసఁగుతన్.

గొప్పలుగావు మహాకవి
యెప్పుడు హీనుల నుతింపఁడీ వరదుఁడు తా
నపోతన యనఁబడి నీ
గొప్పతనము వొగడె నెంతగుణవతివొ సతీ!

## "అంకితము"

ధీరోదాత్తప్రభుండు మాధవుఁడు త
ద్ధీశాలి కర్ధాంగియై

సారాసార వివేకయుక్తయయి స
త్సంతాన సౌభాగ్య వి

స్తారాంచద్వరగర్భ రత్నఖనియై
సత్కీర్తి విఖ్యాతయౌ,

శ్రీరాజత్ కలకుంట వంశరమణ
శ్రీ కిత్తునేత త్కృతిన్

శ్రీ వేంకటేశ పరబ్రహ్మణేనమః. శ్రీ వాగీశ్వర్యైనమః

# శ్రీ వేంకటేశ సుప్రభాతము

**1**

సకల బ్రహ్మాండ మందునే స్థానమేని
వేంకటాద్రితో సమమయివెల్గ లేదు
వేంకటేశుతో సముఁడగువేల్పు, వెనుక
గలుగలేదు ముందీ భువిఁ గలుఁగఁ బోఁడు

**2**

రమ్యకౌసల్యా సుప్రజా ! రామచంద్ర !
ఉర్వివెల్గించెనెల్లెడఁ బూర్వ సంధ్య
ఆహ్నికపుదైవకార్యము లాచరింపఁగ
బురుషశార్దూలలే లెమ్ము ప్రొద్దుగలుఁగ

**3**

లెమ్ము ! గోవింద ! వేవేగ లెమ్ము ! లెమ్ము !
లెమ్ము ! గరుడధ్వజా ! వేఁగలేవవయ్య !
మేలుకొనుము ! శ్రీకాంత ! మమ్మేలు కొఱకు
లలినిముల్లోకములకు మంగళమొనర్ప

**4**

అఖిల జగముల తల్లి శ్రీహరియురాన
కాంక్ష విహరించు సుమనోజ్ఞ కల్పవల్లి
శ్రితజనప్రియ ! సద్దానశీల ! నీకు
సుప్రభాతము శ్రీపతి సుందరాంగి !

౫

సుప్రభాత మోయరవింద సుందరాక్షి !
శారదాప్రసన్న మనోజ్ఞ చంద్రవదన !
విధి శివేంద్రకాంతార్చిత పదసరోజ !
ఓదయారాశి ! వృషశైలనాథ దయిత !

6

సప్తఋషులున త్ర్యాదులు సంధ్యవార్చి
కడుమనోజ్ఞమౌ స్వర్ణదీకమలరాజి
వేడ్కఁగొనిమీ పదార్చకై వేచినారు
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

7

అబ్జభవశివస్కంద శక్రాదులెల్ల
సురలు వామనాదిక కథల్ స్తుతి యొనర్త్రి
సురగురుఁడు పజ్ఞపంచాంగశుద్ధిఁ జదువ
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

8

చారువికచాబ్జ పున్నాగనారికేళ
పూగ సహకార సుందర భూరుహాళి
భవ్యగంధ మందానిల ప్రతతివీచు
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

9

కన్గవల విప్పికేళీశుకాలు లీల
పాత్ర మిగులు రంభా ఫలపాయసముల

మెసవివర పంజరస్థితిఁ గొసరి చదువు
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

10

తంత్రిమీటుల మధురనాదములుఁ జెలఁగ
పాణియాడ నారదుఁడు విపంచి బాఁడు
నీదు గాథయ నంతవాఙ్మయతిఁ గూడి
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

11

అలికులమ్ము మరందరసాను విద్ధ
ఝుంకృతిశ్రుతి మీదు దర్శన మొనర్ప
వచ్చుఁ బ్రాంత సరోజగర్భములు వెడలి
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

12

ఘోషలో, గోపికాదధికుంభ మథన
తీవ్రఘోషల మార్మోగు దిక్కులెల్ల
దధిఘటాలతో పోరాడు విధముదోచు
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

13

అర్కమిత్రాంబుజస్థ మౌయలి కులమ్ము
కలువసిరుల నిజాంగక కాంతిఁ గెలువ
భేరి మ్రోగించుననసేయు పెనురవమ్ము
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

**14**

శ్రీయుతా ! లోకబాంధవా ! శ్రీనివాస !
అఖిల జగదేక పూర్ణదయైక సింధు !
ఇష్టవరద ! శ్రీనిలయ విశిష్టవక్ష !
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**15**

స్వామి ! పుష్కరిణీ జలస్నాత పూత
తనులు హర పితామహసనందనులు మేలు
నెంచివేత్రాహతి శిరమ్ము వంచినిలుతు
రమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**16**

వేంకటాచలాధిప నీదు విమలవసతి
వృషభగిరి, గరుడాద్రి, శ్రీ వేంకటగిరి,
శేషగిరియు నారాయణశైల మంద్రు
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**17**

శివ, సురేశ, కృశానులు, పవన, ధర్మ
వరుణ, నైరుతి, ధనపతుల్ శిరములంటి
యంజలించి నిన్సేవింపనార్తి గొనిరి
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**18**

తావకస్వైర విహరణ ధాటులందు
అశ్వఖగమృగ సర్వహస్త్యధి పతులును

స్వాధికార గురుత్వ యాచనలొనర్చు
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**19**

దేవ ! పరిషత్ప్రధాను లాదిత్యరాహు
సోమ మంగళ బుధ గురు శుక్ర శనులు
దాసదాసాంతి మావధిదాసులైరి
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**20**

నీదు పదధూళి శిరముననించు దాసు
లాత్మస్వర్గా ప వర్గములాసఁ గొనక
కల్పమరుదెంచునను చింతకలఁత పడెద
రమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**21**

పరమ త్రిదివాపవర్గ సత్పథగు లగుచు
నీదు గుడి గోపురమ్ముల నెమ్మిగాంచి
మర్త్యులీ లోకమందుండ మనసుపడెద
రమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**22**

భూరమానాయకా ! దయా పూర్ణ జలధి !
అఖిలలోక శరణ్య దేవాధి దేవ !
ఆదిశేష ఖగేశార్చితాంఘ్రి యుగళ !
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**23**

పద్మనాభ ! నరో త్తమ ! వాసుదేవ !
మాధవ ! జనార్దనా ! చక్రమహిత పాణి
భవ్య శ్రీవత్స ! ఆశ్రితపారిజాత !
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**24**

మార సౌందర్య గర్వ సంహారరూప !
మాకుచాబ్జకుట్మలలోల మహిత దృష్టి !
దీ ప్తకల్యాణ గుణమూ ర్తి ! దివ్యకీ ర్తి !
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**25**

మత్స్య, కూర్మ, వరాహ, వామన, నృసింహ
పరశురామ, రాఘవ, బలభద్ర, కృష్ణ,
కల్కి నామకదశరూప ఘనప్రతాప !
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**26**

పుంఖితై లాలవంగకర్పూర గంధ
వాసిత స్వర్ణదీహైమవారి కుంభ
నిభృతి వైష్ణ వో త్తములిందు నిలిచిరెలమి
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాధ !

**27**

కమలములు వికసించె భాస్కరుఁడు వొడమె
విహగకలకూజితములు దిగ్వీధినిండె

మంగళా శాసనార్థమై మనియెవైష్ణ
వాలి సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

**28**

అ జహరాదిక సురలు మహర్షి గణము
సనకస సనందనాదిక సంయములును
శుభదవస్తువిన్యస్త హస్తులయి వచ్చి
రమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

**29**

శ్రీనివాస ! నిస్తులగుణ సింధురూప !
భవసముద్రతారక సేతుపాద పద్మ !
భవ్యవేదాంత వేద్యసద్భక్త భోగ్య !
అమల సుప్రభాతమ్ము శేషాద్రినాథ !

**30**

భక్తి వేంకటేశ్వర సుప్రభాతములను
అను దినమ్మెనరులు పాఠమొనరిచెదరో
వారికి పరార్థవై భవ శ్రీ రహించు
పారమార్థికస్మృతి నిచ్చు శ్రీ రమణుఁడు

—



# వేంకటేశ్వర మంగళా శాసనము

**1**

శ్రీ రమాధవునకు నర్థసారనిధికి
సకల కల్యాగుణమణి స్థానునకును
వసుధ శ్రీ వేంకటాద్రి నివాసునకును
మాదు శ్రీనివాసునకెందు మంగళమ్ము

**2**

మంగళా శాసన మొనర్చు మాన్యులైన
అస్మదాచార్య పూర్వులైనట్టి సకల
గురువరులచేత సత్కృతి గొన్న యట్టి
మాదు శ్రీనివాసునకెందు మంగళంబు

**3**

శ్రీరమా లోకనాశ్చర్య సింధు భూత
చారు సుభ్రూనవాంబు జచక్షువునకు
సర్వలోక చక్షువునకు సాధుగతికి
మాదు శ్రీనివాసునకెందు మంగళంబు

**4**

శ్రీలసద్వేంకటాచల శృంగశిఖర
మంగళాభరణాంఘ్రి సమ్మానితునకు
మంగళాల వాలంబగు మాన్యునకును
మాదు శ్రీనివాసునకెందు మంగళంబు

**5**

సరస సర్వాంగ సౌందర్య సారనిధుల
క్షితినిజరియించునీ సర్వచేతనులును
ముగ్ధులైక ననెవఁడు సమ్మోహపరచు
మాదు శ్రీనివాసునకెందు మంగళమ్ము

**6**

వరలునిత్యునకును నిరవద్యునకును
నిరత సర్వాంతరాత్మకు నిర్మలునకు
అకుటిలానంద సత్యచిదాత్మునకును
మాదు శ్రీనివాసునకెందు మంగళమ్ము

**7**

తనకుతానన్ని దెలిసిన ఘనతమునకు
సర్వశేషికి నాసర్వశక్త్యుతునకు
సులభునకు సుశీలునకును సువ్రితునకు
మాదు వేంకటేశునకెందు మంగళంబు

**8**

అపరిమిత దయామృత మధురార్ణవమున
కదలియాడు శీతల తరంగములనంగ
వరలు తనయపాంగముల విశ్వమును దడుపు
మాదు వేంకటేశునకెందు మంగళమ్ము

౯

ఒప్పుస్రగ్భూషణాం బరాయుధములకును
మహిత శోభఁగూర్చెడి దివ్య మంగళాత్మ
మూర్తికినినివారిత సకలార్తితతికి
మాదు శ్రీనివాసునకెందు మంగళంబు

**10**

రమ్యవై కుంఠవాస విరక్తినొంది
స్వామి పుష్కరిణీ తటాస్థానమందు
పద్మతో విలాస క్రీడఁబరఁగు చున్న
మాదు శ్రీనివాసునకెందు మంగళంబు

**11**

మాన్యమణవాళ యోగీంద్ర మానసమున
సర్వలోకమ్ములందును సమతనుండు
భక్తకల్ప కద్రుమమయి బరఁగు చున్న
మాదు వేంకటేశునకెందు మంగళంబు

**12**

పూర్ణకామునకును సర్వభూతపతికి
ఆ పరబ్రహ్మమగు పరమాత్మునకును
శుద్ధపరతత్వమునకును సులభునకును
మాదు వేంకటేశునకెందు మంగళంబు

**13**

జగతిఁగలకాల తత్త్వమశాశ్వత మాత్మ
దర్శనమొనర్చు సద్భక్తతతికి నెపుడు
తృప్తినెఱుఁగని యమృతరూపాప్తినొసఁగు
మాదు వేంకటేశునకెందు మంగళంబు

**14**

తలఁచు సర్వమానవులకు శరణ యోగ్య
మైన నిజపాదపద్మముల్ హస్తసంజ్ఞ
దనర పరమదయావాప్తిఁ గనఁ బరచెడి
మాదు శ్రీనివాసునకెందు మంగళంబు

---

శ్రీ వేంకటేశాయనమః

# శ్రీ వేంకటేశ కరావలంబ స్తోత్రము

**1**

అనవరతభక్త ప్రణతార్తి హరణ శీల
దాసజనమనోభీష్టప్రదానలోల
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే. గరావలంబన మీవె వేంకటేశ !

**2**

అఖిల భూతాభయ ప్రదానాబ్జహస్త
సకలలోకైక శరణ ప్రశస్త చరణ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే. కరావలంబన మీవె వేంకటేశ !

**3**

శంఖచక్రనందకగదా శార్ఙ్గపాణి
సత్వరాపన్నివారక సత్యవాణి
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే. కరావలంబన మీవె వేంకటేశ !

**4**

జన్మమృత్యుజరామయ చటులతుంగ
భంగభయద సంసారాబ్ధిబాధితుఁడను
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే. కరావలంబన మీవె వేంకటేశ !

**5**

నిరతకామాదిరి పుషట్క—నీచకార్య
మగ్నహృదయుడనపరాధ మందిరుడను
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంజన మీవె వేంకటేశం !

**6**

వితత సంసార విషభోగి విషయభోగ
విమత సందష్టనష్ట వివేకహతుఁడ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**7**

నిరత మదనానిలోద్ధూత. నిత్యపుష్ట
తరుణతృష్ణాగ్ని కీలావిదగ్ధ మతిని
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**8**

దీనకరికళే బరరక్త పానమత్త
నక్ర శీర్షవిదారక చక్రపాణి
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**9**

శత్రుప్రాణాపనోద భీషణనినాద
చంద్రకాంతి ప్రశస్త శ్రీశంఖహస్త

శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**10**

అరిశిరో నారికేళ సంహరణ చతుర
హారికౌమోదకీ గదాన్యస్తహస్త
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**11**

దనుజతను కంఠనాళ పాటనపటుత్వ
కలితనందక నామక ఖడ్గహస్త
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**12**

అసుర ప్రాణానిల ప్రాశనానురక్త
సర్పసఖ శిలీముఖ వర్షశార్ఙ్గధారి
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**13**

వేదతస్కర సోమక విమతహరణ
విధి వినుతలబ్ధపాఠీన విమల కరణ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే కరావలంబన మీవె వేంకటేశ !

**14**

అమృతహారి మహామందరాద్రి ధారి
మహిత విబుధోపకారి కమఠ శరీరి
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**15**

ధారుణీ మనోహారిణీ త్రాణతోష !
రతహిరణ్యాక్ష శోష వరాహవేష !
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**16**

దైత్యమదగజహర్యక్ష ! ధర్మపక్ష !
త్రాణ గుణదక్ష ! ప్రహ్లాదదాసరక్ష !
శేషశైలనివాస ! శ్రీ శ్రీనివాస
వే, కరావలకబన మీవె వేంకటేశ !

**17**

బలిశిరోనిర్దమన ! దైత్య ప్రాణశమన !
ఘనత్రి విక్రమాకార ! జగచ్ఛరీర !
శేషశైలనివాస, శ్రీ శ్రీనివాస !
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**18**

క్షత్ర దౌర్జన్యహారక కార్తవీర్య
బాహు విదళనచణ దివ్యపరశుధారి !

శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వేం, కరావలంబన మీవె వేంకటేశ !

**19**

దశవదన కంఠలుంఠనకుశల, రామ !
ధరణిజా బంధముక్తి సంధాత ! నేత
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వేం, కరావలంబన మీవె వేంకటేశ !

**20**

అసుర మదగజకుంభ సంహనన సింహ
వ్రజవిలాసినీస్మిత ముఖాంబుజ మధుకర
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వేం, కరావలంబన మీవె వేంకటేశ !

**21**

ప్రాణి హింసానల జ్వాల భయనివార
పూర్ణ కరుణా గుణాంబుధి బుద్ధరూప !
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వేం, కరావలంబన మీవె వేంకటేశ !

**22**

ధార్ష్ట్య యవన దౌర్జన్యలతాల విత్ర
కలి కలంక సంక్షాళన కల్కిరూప
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వేం, కరావలంబన మీవె వేంకటేశ !

**23**

దేవ ! తా పత్రయా ఖిలదావ వహ్ని
తీక్ష్ణకీలా పరీవృత దీనముఖుని
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**24**

అమృత కవచ విషాకార భ్రమవికార
విషమమమతా బడిశలగ్న వివృతముఖుని
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**25**

అమర సౌందర్య సారసుధాబ్ధి జాత
హారి శారదరాకాశశాంకవదన
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**26**

విధిశివామర వందిత పదసరోజ
పీతకౌశేయ, నీలాంబు జాతకాయ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**27**

పద్మనాభ పద్మాలయ, పద్మహృదయ
పద్మకరపద, ముఖపద్మ, పద్మ నయన,

శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

## 28

కనకనూపురకంకణ కంఠహార
రత్నకుండలకేయూరరమ్య మకుట
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

## 29

ఉభయపక్ష ప్రజ్వలదగ్ని యుక్తదారు
కోటరస్థిత విచలిత కీటకమును
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

## 30

సఖ ! ప్రలోభన ధాన్య తృష్ణావినిహతి
మృగయ జాలాపతిత దీనఖగమునైతి
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

## 31

క్షుత్పిపా సానిపీడిత శోకతప్త
బంధు విరహితా శక్త స్తనంధ యుండ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**32**

బంధువులు సంపదలలోనె బంధు జనులు
ధర విపద్బాంధవుఁడ వీవె పరమ పురుష
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**33**

సములనేదరిఁ జేర్తురు సఖులు తాము
స్వామి ! రిక్తకుచేలుర సఖుఁడ వీవె !
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస !
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**34**

అజ్ఞుఁడన శక్తుఁడను దుఃఖ హతుఁడ సుతుఁడ
పతితుఁడన కించనుఁడ నన్యగతి రహితుఁడ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**35**

కుంటివాఁడ వేరెవ్వరు దంటలేరు
ఏడు కొండలపైకినే నెక్కలేను
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**36**

స్వార్థపరులీ ప్రపంచస్థ జనములెల్ల
ఎపుడు తమమేలెతా మెదనెంచు చుంద్రు
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**37**

అరయనప్పుల వారలీ యాలుబిడ్డ
లెవరి కెవ్వారు మృత్యుచే నీడ్వబడఁగ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**38**

ఈ యుభయ లోకముల దొర వీవెకావె
స్వామినీకు నర్పింప నాకేమి గలదు !
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

**39**

మంచివాని గానటియించు వంచకుఁడను
సజ్జనుఁడనే ననన్నీకు చాటు గలదె
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

## 40

వరద నీదునిర్హేతుక కరుణ దక్క
నన్ను రక్షింపహేతు వొండున్న దొక్కొ
శేషశైలనివాస శ్రీ శ్రీనివాస
వే, కరావలంబన మీవె వేంకటేశ !

## ఫ ల శ్రు తి

## 41

వాన మామలై వంశీయ వరదు రచన
మనుజు లెవ్వరేనిద్దీని మాపురేపు
భక్తి జదివిన సంసార బంధముక్తి
బడయుచుంద్రు, ఆపదలను బాసియుంద్రు

# భజ యతిరాజస్తోత్రము

1

యతిరాజాయను యతిరాజాయను
యతిరాజాయను మోయన్నా
సతతము భవభయ జలధి తరింపగ
నితరోపాయం బిలసున్నా

2

శ్రీరంగేశ జయాశ్రయ కేతువు
శ్రితజన సంరక్షణ జీవాతువు
భవభయ జలధికినిఁ డొక సేతువు
పద్మానాధుని ప్రీణతికి హేతువు

3

ఆదిని జగదాధారుఁడు శేషుఁడు
మీద సుమిత్రా నందనవేషుఁడు
ఆదట ధృతహలముసలవిశేషుఁడు
ఆపిదప జగద్గురు పదభూషుఁడు

4

విషయ సుఖానుభవియగు నొకండు
విషయ విరక్తినె వెలుఁగునరుండు
అని హరితత్త్వమువినిచె నెవండు
వానినిమించు వదాన్యుడెవండు

5

నష్ట నయనునకు నేదియాలోకము
మత్త చిత్తునకు నెచటి వివేకము
క్షీణపుణ్యునకు నెదిసురలోకము
ధూతకామునకు నెక్కడి శోకము

6

నిశవనితా సుఖనిద్రాలోలము
ప్రాతః పరదూషణ పటుశీలము
అంత్యంబయ్యె నిజాయుః కాలము
ఏమిదెలియు నీ నరపశుజాలము

7

జరనెంతటి దుర్బలమో దేహము
అంత ప్రబలము విషయగత మోహము
సూక్తి విరక్తుల శ్రుతిపరివాహము
మనసు దలంచును మరొక వివాహము

8

కలుషనికాయములలనా కాయము
తిలకించుచువలచెదు ప్రతిసాయము
విడు విడుహేయ ముతద్వ్యవసాయము
కొనునిరపాయము చరమోపాయము

9

కొందరు లీలాలాల సగతులు
కొందరు బాలాలాలితరతులు

కొందరు డోలాయిత హతమతులు
ఎందరు గలరర్చితయతిపతులు

**10**

రాత్రి దివములును భిక్షాచర్య
పోరువెట్టునంతైనను భార్య
మధ్యన బాంధవసేవయ వార్య
తెలుపు మదెప్పుడో దేవసపర్య

**11**

అంధమునయనము, అవనీ శయనము
మందము వచనము, మలినము వదనము
ఆకాలమున గృహో వనమున కని
కోరెదుదత్త తనూజానయనము

**12**

తాళచ్ఛదకృత కుబ్జకుటీరము
సాయం సంధ్యల కబళాహారము
వివిధ పటచ్చరధారణ ఘోరము
అతనికె బ్రహ్మ సమాహంకారము

**13**

మంత్రద్రవ్య విశుద్ధము యాగము
సర్వారంభ విరాగము త్యాగము
కలినివిశక్యమె సులభమె యోగము
బరువెయతీశ గుణామృత భోగము

14

పైనమహోపల వర్షాసారము
మార్గముకర్దమకంటక పూరము
చంకకు భారము తలనొకిశోరము
ఎవనికి సుఖమిడు నీ సంసారము

15

వివిధ విచిత్రమనో రథకోశను
కొలిచెదు వ్యర్థవిషైక దురాశను
ఇచట లభించదు నీకు తృణైకము
కాని లభించును ఘనతర శోకము

16

నరపతినైనను సురపతినైనను
అజునైనఁ సర్వాధికునైనను
మమతాహంకృతి మలినుని లోకము
వేయును నిందఁతో నభిషేకము

17

పాపహతునకుఁ పుణ్యయుతునకుఁ
సురనరతిర్యగ్జాతి గతునకుఁ
రామానుజ పదతీర్థమె ముక్తిని
నొసగును యతిపతిఁ గొలువుమి భక్తిని

18

గుణి గుణముల భేదంబిది నిత్యము
చిదచిద్ద్వయ పరభేదము సత్యము

తద్వయదేహుఁడు హరియను తత్వము
కనుము విశిష్టాద్వైతమె తత్వము

**19**

యతి పతిపద జలకణికా సేకము
చతురక్షర పదయుగ్మ వివేకము
ఎవనికి సాలనగర్భవ లోకము
వానిపదహతమ్మగు యమలోకము

**20**

తలపుము సర్వము చిదచిద్రూపము
ఆ హరికనువగు వపుస్వరూపము
అనుచుఁ దెలిసి యెవ్వరిపై కోపముఁ
జూపకు పొందెదు పశ్చాత్తాపము

**21**

ఎవఁడీ యతిపతి మంత్రరహస్యము
తెలియునో వాడె సదస్స్యుడవశ్యము
తచ్చరణద్వయ దాస్యముపాస్యము
తద్విపరీతము మతమపహాస్యము

**22**

వైష్ణవ కులగుణ దూషణచింతా
సేయకు మదియేనిజకులహంత
యతిపతియే వారందరి గురువు
మతినెరుగుమియమ్మహి తులపరువు

**23**

విద్యానిపుణులమని యొక కొందరు
హృద్యంబగు ధనికులమని కొందరు
సత్కుల జాతులమని మరికొందరు
వాదింతురు కలికింకరులందరు

**24**

యమకింకర కరలోలము శూలము
హరియించును నీ జీవితమూలము
దహియించును నిను బాంధవ జాలము
రమియింతువె సతితో తత్కాలము

**25**

సుమసుకుమారము శోభితమారము
రతిసుఖసారము యువతి శరీరము
గత జీవితమున ఘోరవికారము
మతినారసిచను దూరము దూరము

**26**

నరవాహన గజతురగా రూఢుల
నారీసుతపోషణ గుణగూఢుల
నానారంజక విద్యా ప్రౌఢుల
నాగరికుల నడుగుదు యతిమూఢులె ?

**27**

ఎవని ముఖమ్మున యతిపతి సూక్తియొ
వానికరతలామలకము ముక్తియు

నరకము నన్దొ్రియును నవయుక్తియొ
రక్షించదు సామాన్యనిరుక్తియొ

**28**

తస్కర జారవిదూషక ధూర్తులు
మస్కరమౌని దిగంబర వృత్తులు
గుప్తసతీ సుతధన మదమత్తులు
గురువులొకో ? పరవంచక చిత్తులు

**29**

కాంతిమతీ సుకుమార కుమారుని
కేశవ సింహకిశోరు నుదారుని
రామానుజయతిరాడవతారుని
మూకాంధులకు ముక్తినిడు వీరుని

**30**

కాషాయాంబరకవచితగాత్రుని
కలితకమండలు దండపవిత్రుని
విధృత శిఖాహరిణాజినసూత్రుని
వ్యాఖ్యాతద్వైపాయన సూత్రుని

**31**

యామున పూర్ణకృపోజ్వల గాత్రుని
రామాజ్ఞాక్షమునీక్షణ పాత్రుని
కోమలశఠ రిపుపదయుగ మాత్రుని
శ్రీమాధవ సేనాపతి మిత్రుని

**32**

ప్రవచనశక్తుఁడు ప్రజ్ఞాయుక్తుఁడు
పరహితసక్తుఁడు పరమవిరక్తుఁడు

నానాదైవతభ క్తుఁడు యుక్తుఁడు
కాడిలముక్తుఁడు కాడిలముక్తుఁడు

33

సకలోపాయా చరణము విడువుము
యతిపతి చరణమె శరణము నుడువుము
భవభయ సాగరపారము జేరుదు
సత్యము ముమ్మాటికి నిదిసత్యము

34

భగవద్రామానుజ షట్త్రింశతి
సాలగ్రామ గురూత్తమ వంశ్యుఁడు
కౌండిన్యసకవినుడివె పవిత్రము
రంగార్యుడు యతిరాజ స్తోత్రము

35

ఒకడీభువి, నగుకరపుట పాత్రుఁడు
సుతరక్షకు నాశ్రితమఠ సత్రిఁడు
అతఁడు ముదిసినంతనె, సకళత్రిఁడు
నై, "రండాసుత"యను నాపుత్రుఁడు

36

శ్రుతిశిరసులకత్యంత విదూష్యము
సూత్రానభిమత మతివై దూష్యము
ఆది, నమంగళ మన్మృత విశేష్యము
కీర్తింతువు ప్రాకృతకృతభాష్యము

శ్రీ శంకరాచార్య విరచిత

# భజగోవిందస్తోత్రము

**1**

గోవిందాయను గోవిందాయను
గోవిందాయను మూఢమతీ
కాలము సన్నిహితంబై వచ్చిన
కాపాడదు నిన్నీజగతి

**2**

మూఢ విడువుము ధనాగమతృష్ణను
మది సద్బుద్ధిని మనుచు వితృష్ణను
ఏదిలభించు స్వకర్మో పాత్తము
తద్విత్తముతోఁ దనుపుము చిత్తము

**3**

నారీస్తన భరనాభీ దేశము
నారసి పొందకు మత్యావేశము
తను విదిమాంస వసాది వికారము
మనసున దలపుము వారము వారము

**4**

నళినీదళగత జలమతితరళము
అటువలె జీవిత మతిశయచపలము
మనమెయి వ్యాధ్యభిమానగ్రస్తము
లోకము శోకహతమ్ము సమస్తము

**5**

ఎంతవరకు విత్తార్జన సక్తియొ
అంతవరకె పరివారపురక్తియు
పిదపబ్రదికె నాముదిసిన యొంట
అతని వార్తయెవడఁడుగఁడు ఇంట

**6**

ప్రాణము దేహములోగల వరకే
క్షేమమ్మడుగుట లప్పటి కొఱకే
సాపాయత బుసనిలిచెడి వరకు
సతియు శవముగని బెగడు చివరకు

**7**

బాల్యావస్థన్ కేళీ సక్తుఁడు
తరుణావస్థన్ దరుణీ సక్తుఁడు
వార్ధక్యమ్మున చింతా సక్తుఁడు
పరబ్రహ్మయం దెవఁడా సక్తుఁడు

**8**

ఎవ్వఁడు పుత్రుండెవతెకళత్రము
ఈ సంసారం బెంతో విచిత్రము
ఎవడవు వచ్చితి వెచ్చటి నుండి
భ్రాతా ! యాతత్వము తెలియండి

**9**

సత్సంగతినిస్సంగతి దార్చును
నిస్సంగతి నిర్మోహము గూర్చును

నిర్మోహత్వమిడు నిశ్చల తత్వము
అచల తత్వమిడు జీవన్ముక్తిని

**10**

వయసుడిగిన నెదికామ వికారము
నీరింకిన నెక్కడి కాసారము
ధనహీనున కెచ్చటి పరివారము
తత్వజ్ఞున కెక్కడి సంసారము

**11**

ధనయువతలఁ గని పెనుచకు గర్వము
హరియించును త్రుటికాలము సర్వము
అన్నియు మాయామయ మని భక్తి
బ్రహ్మపదవి జొరిపడయుమి ముక్తి

**12**

రాత్రిందిన ప్రాతస్సా యమ్ములు
తిరిగివచ్చు శిశిర వసంతమ్ములు
కాలక్రీడల గతించునాయువు
ఐనను నిన్విడ దాశావాయువు

**13**

ఏటికి ! కాంతాధనగత చింత
బాలిశ లేడిల నీకు నియంత
సజ్జన సంగతి క్షణమగుఁ గాక
అదియే భవాంబుధి దాటగనౌక

**14**

జటి, పరిముండిత సర్వ శిరస్కుఁడు
కాషాయాంబర కవచిత వేషుఁడు
కనులను గల్గియు కాంచడు మూఢుఁడు
ఉదరనిమిత్తమె బహుకృత వేషుఁడు

**15**

ముడుతల చర్మము నెరసెను శిరము
పండ్లురాలిపడె వదన గహ్వరము
చనువృద్ధుఁడు కఱ్ఱనుఁగొన స్వకరము
అపుడును విడబో దాశా మకరము

**16**

ముందు కృశానువు వెనుకనొ భానువు
రాత్రుల గద్దువనంటిన జానువు
కరతల భిక్షము తరు తలవాసము
అంతయినను విడదాశాపాశము

**17**

పుణ్యతీర్థముల మునుఁగుచు వచ్చును
వ్రతములొనర్చునుదానము లిచ్చును
ఇన్నియుండి జ్ఞానములేకున్న
జన్మ జన్మములముక్తియెసున్న

**18**

సురమందిర తరు మూల నివాసము
అవనియెశయ్య యజినము వాసము

సర్వపరిగ్రహ భోగత్యాగము
ఎవనికి సుఖమిడదిలను విరాగము

**19**

యోగరతుఁడు నున్భోగరతుఁడునున్
సంగరతుఁడును న్సంగ రహితుఁడున్
బ్రహ్మరతమ్మున బనిచిన చిత్తము
నానందిచును నాతఁడె నిత్యము

**20**

ఇంచుక భగవద్గీత పఠించిన
కొంచెము గంగాంబువు సేవించిన
నొకపరి మురహరిసేవలఁ దేలిన
నామనుజుని యముఁడే మనజాలును

**21**

తిరిగియు జననము తిరిగియు మరణము
మరల జనని గర్భమ్మున శయనము
సంసారము దుస్తర మగధారీ
సత్కృపగాంచవె శరణుమురారీ ।

**22**

రచ్చల బిచ్చపుచింపిరి బొంతలు
పుణ్యా పుణ్య వివర్జిత పంథలు
యోగనియుక్త స్వాంతుఁడు యోగి
బాలోన్మత్తులవలె మనుత్యాగి

**23**

ఈవునేనెచటివారమెవారము
ఎవరు ? పితరులెవ్వరు ? పరివారము
ఎడద దలంపుము సర్వమసారము
విడువుము జగమొక స్వప్న విచారము

**24**

నీ నాలో నన్యత్రయు విష్ణువ
వృధ కోపింతువునన్న సహిష్ణువ
అంతటంగను మీయాత్మ విధానము
ఎల్లెడ విడువుము భేదజ్ఞానము

**25**

శత్రులు మిత్రులు పుత్రులు బంధులు
అనియత్నింపకు విగ్రహ సంధులు
ఎల్లెడం జూపుము నీవు సమత్వము
త్వరగా వాంఛించిన విష్ణుత్వము

**26**

కామక్రోధాదికరిపులంగని
విడిచితలంపుము నేనెవ్వడనని
ఆత్మజ్ఞాన విహీనులు మూఢులు
వారు తపింతురు నరక నిగూఢులు

**27**

గీతానామ సహస్రమె గేయము
సీతారాముల రూపమె ధ్యేయము

సాధు సంగతుల నుంపుము చిత్తము
పేదవారికె యొసంగుము విత్తము

**28**

వనితతోడఁ బొందును సుఖభోగము
పిదప శరీరమునణచును రోగము
చివరకు భువిలో మరణమె శరణము
ఐనను విడువఁడు పాపా చరణము

**29**

అర్థమనర్థమునరయుమి నిత్యము
లేదచ్చట సుఖలేశము సత్యము
సుతుతోడను ధనయుతులకు భీతియె
అంతట విహితమ్మది యీ రీతియె

**30**

ప్రాణాయామము ప్రత్యాహారము
నిత్యా నిత్య వివేక విచారము
జపతప సహిత సమాధి విధానము
మది నొనరింపుము మహదవ ధానము

**31**

గడచును రాత్రులు నడచును దినములు
ఉరుకును పక్షము పరు విడుమాసము
అరుగును నొకటొకట యనము వర్షము
అపుడును విడబోదాశా మర్షము

## 32

గురు చరణాంబుజ నిర్భర భక్తిన్
భవమునుండి త్వరబడయుమి ముక్తిన్
సేన్ద్రియ మానస నియతిన్నీవున్
చూతువు నీ హృదయస్థుని దేవున్

## 33

స్తుతమతి శంకరుసూక్తి ప్రబోధము
వరదార్యుం డొనరిచెనను వాదము
దీనిఁబఠించిన జ్ఞానులు భక్తులు
బ్రిదుకుగల్గి భవబంధ విముక్తులు

శ్రీ శంకర విరచితము

# శ్రీలక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రము

**1**

అభవక్షీరాబ్ధినిలయ రథాంగపాణి !
భోగిభోగ రత్నవికాస పుణ్యమూర్తి
అఖిలయోగి శరణ్య భవాబ్ధిపోత
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**2**

బ్రహ్మరుద్రేంద్రి మరుదర్క భవ్యమకుట
మణిమయూఖ నీరాజిత మహితపాద !
రమ్య శ్రీరమాకుచ పద్మరాజహంస !
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**3**

భయద సంసార సాగరాశ్రయమహోగ్ర
కామసక్ర గ్రసన్మస్తక శ్రమునకు
గాఢరాగోర్మిమగ్న విపీడితునకు
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**4**

ఘోర సంసారగహన సంచారునకును
భయద మృగదంశ మారోగ్ర బాధితునకు
హరి ! మురారి ! మత్సర నిదాఘార్తునకును
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**5**

ఘోరసంసార మాతంగకూౄరఘాత
వారనిషీప్యమాన శరీరునకును
మరణకృత భవభీతి సమాకులునకు
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా !

**6**

నాధ సంసారకూప మగాధమూల
మాధిశతసర్ప సంగత మాశ్రయించు
దీనునకు శరణాగత ప్రాణునకును
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా !

**7**

భయదసంసార విషదుష్ట పన్నగోగ్ర
తీవ్రదంష్ట్రాకరాళవి దీర్ణమతికి
గరుడవాహనా ! క్షీరాబ్ధివరనివాస
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా !

**8**

వెడగు సంసారమనువలంబడిన నాకు
ఇంద్రియసుఖాల గాలాలనిరుకుకొనుట
నోరుదెరచిన మీనునై నొగులునొందు
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా !

**9**

కర్మశాఖా, కరణపత్ర, కామకుసుమ,
వికృత సంసారతరువఘ బీజయుతము

కొనగొమలనెక్కి విపదబ్ధిగూలినాడ
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా ।

**10**

సతత సంసారదావ విసారితోగ్ర
ఘోర కీలావిదగ్ధ తనూరుహానకు
మహితయుష్మత్పదాబ్జ స్థమ స్తకునకు
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా ।

**11**

శౌరిప్రహ్లాద ఖేదాపహారి నిరత
మలిన సంసార వారాశిమగ్నుడనగు
దీనునను గాంచి కరుణానిధానరూప
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా ।

**12**

సంసరణ గజయూథ దంష్ట్రావిభీత
దుష్ట మతిదైత్యభయద విశిష్టరూప
గాఢమృతి భవభీత్యంధకారదీప
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా ।

**13**

సంసరణయోగ సకలవాంఛాదినిత్య
కర్మసంప్రాప్త మృతిదుఃఖకాండనాశ
సింధుసుత కుచకాశ్మీర చిహ్నవక్ష
నా కుకేలూతనిడవె శ్రీనారసింహా ।

**14**

కట్టిభయపెట్టి యమభటుల్ కశలఁగొట్టి
పట్టిశత పాశములలాగు పథములందు
చకితుడను పరవశుడ నేనొకడనపుడు
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**15**

బలవదింద్రియాఖ్యాక చోరులకుఁ జిక్కి
అపహృత వివేకధనుడనై యంధుడనయి
ప్రబలమోహాంధకార కూపమున బడితి
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**16**

శ్రీశ ! సరసిజనాభ ! సురేశ ! విష్ణు !
విమలయజ్ఞేశ ! మధువైరి ! విశ్వరూప !
కేశవ ! జనార్ధనా ! హరి ! వాసుదేవ !
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**17**

భక్త ప్రహ్లాద నారదశక్తిపుత్ర
సత్యపుండరీక వ్యాసశౌనకశుక
భక్తనిలయ ! దాసావనపారిజాత !
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**18**

శంఖచక్రమ్ములుభయహస్తములఁ దాల్చి
అబ్ధితనయాంసముల నన్యహస్తముంచి

అన్యమున వరదాభయహస్తముద్ర
చేర్చికేలూతనొసగవే శ్రీనృసింహ !

**19**

అజునమేయునవ్యయుని నాద్యంత శూన్యు
ధృతిహరాదిత్య వేదవినుత ప్రభావు
నినురమాధరమధుపమత్తుని దలంతు
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**20**

నారసింహ ! రామ ! వరాహ ! భూరమాది
సుందరీలోల ! విధుశూలిసురవరివంద్య
హంసపరమహంసాత్మవిహారలీల !
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**21**

తల్లిదండ్రులునీవె వన్నదమ్మలీవె
చెలులు ద్రవిణమ్మునీవె విద్యలునునీవె
స్వామివీవెనాకీ భువిసకల మీవె
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

**22**

భక్తప్రహ్లాద హృదయాబ్జసక్తభృంగ !
మహితగంగోర్మిధవళాంగ ! మాస్థితాంగ !
సరస సంగరముకుటలసద్వరాంగ !
నా కుకేలూతనిడవె శ్రీనారసింహ !

23

శంకరార్య విరచితమీ స్తవము దీని
నేనరుండు పఠించు నీయిలనతనికి
సకలపాపముల్నశియించి శౌరిపాద
సన్నిధి లభించుమునిగణ స్తవముచెలగ

24

వసుధమాయార్జితవపుః ప్రవాహమగ్న
మానవాలికరావలంబమగు నెద్ది
ఆ స్తవము శ్రీనృసింహ పాదాబ్జమధుప
కల్పశంకరకృతము మంగళకరంబు

25

రాజితనృసింహ విభవతార్క్ష్య ధ్వజునకు
భవహరునకు తాపత్రయో పశమనునకు
ఐహికాశాది భుజగజలాగ్నిరోగ
వృశ్చికక్లేశహరునకు వినతిసేతు.